# ఆంధ్రపత్రిక

317017



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 34 No. 311 THURSDAY 4th MARCH 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

## భారతదేశంనుండి ఆఖరు బ్రిటిష్ పటాలం ప్రయాణం

భారత దేశంనుండి బ్రిటిషు సేనల ఉపసంహారం గత శనివారం పూర్తి అయింది. ఆఖరు బ్రిటిష్ పటాలం బొంబయిలో ఓడ ఎక్కేముందు గవర్నరు మహారాజ్‌సింగ్‌గారు వీడ్కోలు సందేశం ఇచ్చారు.

# సంస్థాన శాంతిరక్షణకవసరమైన సైన్యంతో తృప్తిచెంద నిజాం సంసిద్ధత

## తమ కనీసపుకోర్కెల వివరిస్తూ గవర్నరు జనరల్‌కు హైద్రాబాద్ రాయబారంనివేదిక

### అఖిల పక్ష మంత్రివర్గ స్థాపనకు అంగీకారం

న్యూఢిల్లీ, మార్చి 2: హైదరాబాదు ప్రతినిధివర్గానికి, భారతయూనియన్ ప్రభుత్వానికి మధ్య, సంస్థాన భవిష్యత్తు విషయమై మూడురోజులుగా సాగుతున్న సంప్రదింపులు నేడు చరమస్థాయికివచ్చి, ప్రస్తుతానికి పరిసమాప్తియైనాయి.

ఈ సంప్రదింపుల ఫలితంగా, శాశ్వత పరిష్కారసాధనకు సంబంధించి ఉభయప్రభుత్వాలను ఎదుర్కొంటున్న సమస్యలు స్పష్టంగా బయటపడ్డాయి. ముందుముందు కుదురబోయే ఒడంబడిక, భారత యూనియన్, నిజాంప్రభుత్వాల భావిరాజ్యాంగ సంబంధం స్వరూపాన్ని నిర్ణయించగలవు.

## అయిదేళ్లలో మరో యుద్ధం

### మాలటాఫ్ జోశ్యం

సోవియట్ విధానంపై బ్రిటిష్ పత్రికల విమర్శ

లండన్, మార్చి 2: "యుద్ధం అనివార్యం అనే విషయంలో నాకు ఎలాంటి అపోహలుగాని, అనుమానాలుగాని లేవు. కాని అయిదేళ్ళ మధ్య మరో యుద్ధం ప్రారంభం కాగల అవకాశం మాత్రం ఏమీ లేదు" అని సోవియట్ విదేశాంగమంత్రి మాలటాఫ్ మూడుమాసాల క్రితం లండన్ వచ్చినప్పుడు సోవియట్ రాయబారి కార్యాలయంవారు ఏర్పాటుచేసిన ఒక విందులో వెల్లడించినట్లు బ్రిటిష్ పార్లమెంట్ కార్మికపక్షసభ్యుడొకడు నిన్న కామన్సు సభలో ప్రకటించాడు.

ఆరోజున మాలటాఫ్ అనేక విషయాలు చెప్పారనీ, అవన్నీ అక్షరాలా జరుగుతూ ఉన్నవనీ ఈ సభ్యుడు వెల్లడించాడు.

లండన్ పత్రికలన్నీకూడా తృతీయసంగ్రామం తప్పదనేధోరణిలోనే బ్రిటిష్ ప్రభుత్వరక్షణవ్యయంపై కామన్సుసభ చర్చపై వ్యాఖ్యానాలు చేసినవి. రాజ్యాధిపతుల సమావేశంజరిపి ఈ యుద్ధాన్ని నివారించాలని కార్మికపక్ష పత్రిక డెయిలీ హెరాల్డ్ వ్రాసింది. ఇటీవల చెకస్లవేకియా సంఘటనలను ఫిన్లెండ్‌కు స్టాలిన్ ప్రతిపాదనలను విమర్శిస్తూ స్పెయిన్ పోర్చుగల్‌గాక మిగతా యూరపునంతా తన చేతులో పెట్టుకొనేవరకూ రష్యాఆగేటట్లు లేదని ఈ పత్రికలు విమర్శించినవి. ఈ ప్రాపకప్రాంత విస్తరణ కార్యక్రమాన్ని విరమించవలసిందిగాఅన్ని పత్రికలూ రష్యాను హెచ్చరించినవి. అమెరికా అటంబాంబులవర్షం కురిపించి రష్యా అటకట్టించాలని ఒకపత్రిక సూచించింది.

## చైనాకు అమెరికా సైనిక సహాయం

### తక్షణం జరగాలని కాంగ్రెస్‌కు సూచన

మాస్కోలో రాయబారిగానుండిన బూలిట్ హెచ్చరిక

వాషింగ్టన్, మార్చి 2: చైనాకు 10 కోట్ల డాలర్ అమెరికన్ సైనిక సామగ్రి సహాయానికి సంబంధించిన ప్రతిపాదనను అమెరికన్ కాంగ్రెస్ ఆమోదించాలని పూర్వం రష్యాలో రాయబారిగా పనిచేసిన విలియం బుల్లిట్ యివ్వాళ కాంగ్రెస్‌కు సలహా ఇచ్చాడు. యావత్తు మాత ప్రాచ్యరంగానికి కీలకప్రదేశం చైనా. కాబట్టి చైనా కమ్యూనిస్టుచేతుల్లో పడిపోతుంటే మనం చేతులుముడుచుకొని కూర్చున్నామంటే, స్టాలిన్ ప్రేరేపితులైన జపానీసులు మనదేశంపై దండయాత్ర చేయడానికేమీ ఆటంకం ఉండదు. ఒక్క యూరప్‌లో కమ్యూనిజాన్ని ప్రతిఘటించినంతమాత్రాన, ప్రపంచంపై కమ్యూనిస్టు దురాక్రమణను అరికట్టలేము అని బుల్లిట్ అమెరికన్‌కాంగ్రెస్ విదేశాంగ వ్యవహార ఉపసంఘంయెడ, చైనాకు అమెరికాసహాయం అవశ్యకతను గురించి సాక్ష్యమిస్తూ అన్నాడు.

ప్రజ్ఞాధురీణుడైన ఉన్నతోద్యోగి నొకనిని వెంటనే నాన్‌కింగ్‌కు పంపి, చైనా ఆర్థిక, రాజకీయ సైనికసమస్యల పరిష్కారానికి అమెరికా ప్రభుత్వం తోడ్పడాలని కావలసినంత మందుగుండు సామాను చైనాకు అందేటట్లు చూడాలని బుల్లిట్ అన్నాడు.

## నిజాం ప్రభుత్వ వినతి పత్రం

హైదరాబాద్ రాయబారవర్గ నాయకుడు, సంస్థాన ప్రధానిఅయిన మీర్ లాయిక్ అలీ, యివ్వాళ లార్డు మౌంటుబాటెన్‌ను కలుసుకొని సంభాషించాడు. హైదరాబాద్ సంస్థాన ప్రధానకోరికలను సంక్షిప్తంగా తెలుపుతూ తయారుచేసిన ఒక పేజీల వినతిపత్రాన్ని (మెమోరాండం) మీర్‌లాయక్ అలీ, లార్డు మౌంటుబాటెనకు అందజేసినట్లు తెలుస్తున్నది. ఈ కోర్కెలకు భారతయూనియన్ ప్రభుత్వం న్యాయంగా తన సమ్మతి తెలిపే యెడల, భారత ప్రభుత్వంతో శాశ్వతమైన మైత్రి ఒడంబడికను కుదుర్చుకోవడం హైదరాబాదు ప్రభుత్వానికి సులభసాధ్యమౌతుందని కూడా, లాయక్ సూచించినట్లు తెలుస్తున్నది.

హైదరాబాదు రాయబారవర్గం సమర్పించిన యీ వినతిపత్రానికి భారత ప్రభుత్వం రేపు శుక్రవారం ఉదయం లాంఛన ప్రాయంగా సమాధానమిస్తుంది. శుక్రవారం

(3-వ పేజీ చూడుడు)

## పాలస్తీనా ప్రభుత్వంపై యూదు ఆరోపణ

జెరూసలేం, మార్చి 2: "పరిపాలనా నిర్వహణలో తన నిష్పక్షపాతాన్ని విస్మరించి జాతి విద్వేషాన్ని రగుల్కొల్పింది. పాలస్తీనా ప్రభుత్వమే. అందుచేత ప్రపంచ నాగరక ప్రభుత్వాలలో ఒకటిగా పిలువబడే హక్కును పాలస్తీనాప్రభుత్వం కోల్పోయింది."

బ్రిటిష్‌వారిపట్ల జాతివిద్వేషాన్ని యూదులు రెచ్చగొడుతున్నారని ఆరోపణచేస్తూ పాలస్తీనాప్రభుత్వం నిన్న వెలువర్చిన ప్రకటన ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని ముఖ్యంగా లేక్‌సక్సెస్‌లో పెద్దల మనోభావాలను చికాకుపర్చడానికే ఉద్దేశించబడింది" అని యూదు రేడియో కడచినరాత్రి పాలస్తీనాప్రభుత్వ ప్రకటనను తీవ్రంగాఖండిస్తూ అన్నది.

భారతీయ పటాలంతరఫున ప్రాంతీయ అధికారి బ్రిటిష్‌దళాధిపతికి 'గేట్‌వే ఆఫ్ ఇండియా' రజతప్రతిమను సమర్పించారు.

## కాశ్మీర్ పూర్తి శత్రు నిశ్శేషమైన తరువాతనే జనవాక్యనిర్ధారణ

### శ్రీ గోపాలస్వామి అయ్యంగారి ఉద్ఘాటన

న్యూఢిల్లీ, మార్చి 2: ఇండియా ప్రభుత్వమంత్రియు, భద్రతాసంఘ భారత రాయబారవర్గ నాయకుడునుఅగు శ్రీ ఎన్. గోపాలస్వామి అయ్యంగారు ఫలమ్‌లో వేయిమంది భారత విమానదళ ఆఫీసర్ల సమావేశములో ఉపన్యసించుచు, కాశ్మీరు యుద్ధములో ధైర్యసాహసములు చూపిన వైమానికులను వేనోళ్ళ ప్రశంసించిరి. కాశ్మీరు శత్రునిశ్శేషమైన నాడే జనవాక్య నిర్ధారణ జరుగునని తెలిపిరి.

కాశ్మీరువిషయమై భారతయూనియను అవలంబించిన వైఖరి మొదటినుండియు క్రమమైనదిగాను, ప్రజాపక్షమును నూత్రములకు అనుగుణమైనదిగా నుండెనని ఆయన చెప్పెను. భద్రతామండలి విచారించవలసిన సమస్య సులువైనదని, పాకిస్థాను లేవదీసిన అన్యసమస్యలకు తావేమియు లేదని ఆయన చెప్పెను. 'దురాక్రమణను అంతముచేసి తిరిగి ప్రజలు శాంతియుతముగా జీవింపగలుగునట్లుచేయుట కాశ్మీరు సద్యోసమస్యయై యున్నది. ఒక్కదురాక్రమణదారైననుసరే కాశ్మీరుగడ్డపై నున్నంతకాలము భారతదేశము కాశ్మీరు ప్రజలయెడల తన బాధ్యతను విడనాడజాలదు. కాశ్మీరులో జనవాక్యనిర్ధారణను స్వేచ్ఛగాను, న్యాయముగాను జరుపు విధిని ఇండియా యెన్నటికీ తప్పించుకొనదు. కాని మామూలుపరిస్థితు లేర్పడినమీదటనే జనవాక్యనిర్ధారణ జరుగవలసియున్నది. ఈ అంశంపై భారతదేశము అచంచలమయిన వైఖరి నవలంబించును. న్యాయంగాను, ధర్మంగాను ఈసమస్య పరిష్కారంకాగలదను ఆశతో నేను లేక్‌సక్సెస్‌కు వెళ్ళుచున్నాను' అని శ్రీ గోపాలస్వామి అయ్యంగారు చెప్పిరి.

కాశ్మీరు ప్రజలకు సహాయముచేయ భారతప్రభుత్వము ప్రతిజ్ఞగావించెననిప్రతిజ్ఞ నెరవేరునట్లు చేయవలెననిరి బోధించిరి

## కామన్వెల్తుశాఖా కార్యదర్శితో పాకిస్థాన్ వైదేశికమంత్రి మంతనాలు

### కాశ్మీర్ సమస్యపై బ్రిటిష్ వైఖరిలో మార్పు ఏమీ రాలేదని విషయజ్ఞుల భావం

లండన్, మార్చి 2: పాకిస్థాన్ విదేశాంగ మంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్, బ్రిటిష్ కామన్వెల్తు శాఖా మంత్రి నోయెల్‌బేకర్‌తో ఇవాళ రహస్య సంభాషణలు జరిపారు. జఫ్రుల్లాఖాన్ నోయెల్ బేకర్‌తో సమావేశం జరపడం ఇది రెండో పర్యాయం.

లండనులో పాకిస్తాన్ హైకమీషనర్‌గా ఉన్న హబీబ్‌రహీమ్‌తుల్లాగారు ఇవాళ సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్, పాకిస్తాన్ ప్రభుత్వకార్యదర్శి మహమ్మదాలీ గౌరవార్థం విందుచేసి నోయెల్ బేకర్ను అతిథిగా ఆహ్వానించాడు. ఈవిందుసందర్భంలోనే జఫ్రుల్లా ఖాన్ నోయెల్ బేకర్‌తో ద్వితీయపర్యాయం సంభాషణలు జరిపాడు.

కాశ్మీర్‌సమస్యపై బ్రిటిష్ ప్రతినిధివర్గం పక్షపాతం ప్రదర్శించిందని భారతీయ ప్రజలు అభిప్రాయపడుతున్నట్లుగా ఇక్కడికి వచ్చిన వార్తలు బ్రిటిష్ అధికారవర్గాలకు చాలా ఆశాభంగం కలిగించినవి.

భద్రతామండలిలోని మిగతా ప్రతినిధివర్గాల వలెనే, బ్రిటిష్‌ప్రతినిధి వర్గంకూడా వివిధ వివాదాంశాలను పరిశీలించి ఉభయ దేశాలకు సర్వతోముఖమైనటువంటిన్ని సర్వపక్షసమ్మతమైనటువంటిన్ని పరిష్కారము కుదర్చడానికి శాయశక్తులా పాటుపడుతున్నదనీ, అభిప్రాయభేదాలను

(3-వ పేజీ చూడుడు)

